## విషయసూచిక

# పీఠిక

“సాప్తపదీనం సఖ్యం” అని చెప్పఁబడిన మైత్రియే శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారికి, నాకును గల మిత్రత. అయినను ప్రతిభావంతులతోడి సాంగత్యము క్షణకాలమయ్యు క్షీరనీరన్యాయముగ వేఱుపరుప శక్యము గాకుండు ననుటకు ప్రస్తుత పీఠికా రచనా యత్నమే నిదర్శనము.

శ్రీ శర్మగారు రచియించిన గ్రంథముల నన్నిఁటిని నేను వారికిఁ బరిచితుఁడ గాక పూర్వమె చదువు భాగ్యము కలిగినది. ప్రస్తుత “భీమేశ్వర నుతి” ముద్రణార్హము వారు నా వద్దకుఁ బంపిరి. అంతటితో నూఱకొనక పీఠికా రచనా భారమును గూడ నాపై నుంచిరి.

కవికంటె విమర్శకుఁడు, లేక పరిచాయకుఁడు నధిక పాండితీ సంశోభితుఁడై యుండవలయుననుట లోకవిదితము. ఈ విషయమున వారికిని నాకును బరస్పర మిత్ర సంబంధము గాక, గురు శిష్య సంబంధము, పితా పుత్ర సంబంధము సర్వథా యోగ్యమైనదని నా యూహ — అటులయ్యు నాజ్ఞప్తుఁడ నగుటచే నేనీ ప్రయత్నము సాగించవలసినవాఁడ నైతిని.

శ్రీ శర్మగారి పాండిత్య మెట్టిదో విజ్ఞులు పై నా మాటవలన గ్రహించియుందురు. శ్రీ శర్మగారు పండితులు, కవులు, వైద్యులు, మంత్రశాస్త్ర పారంగతులు. మఱియు ఆధ్యాత్మిక సాధనయందుఁగూడ కడు సమర్థులని భీమేశ్వర నుతి, తదితర గ్రంథములవలన నెఱింగితిని.

ప్రస్తుత గ్రంథ మొక సామాన్యమగు నీశ్వరస్తోత్రరూపమునఁగాక, “శివాష్టోత్తర శతనామావళి” యందలి శివనామ ప్రపంచమునకు, భాష్యరూపముగ శబ్దభేదమేగాని యర్థమున శివాష్టోత్తర శతికిని, బ్రహ్మస్వరూప స్వభావాదులను విపులముగ వివరించు, వేదాంతగ్రంథములకును భేదములేదని నిరూపించు నుత్తమ గ్రంథరత్నము. ఇందు శ్రీ శర్మగారి యతులిత భక్తిభావన, ఉపాసనానిష్ఠాత్మత, ఉన్నత భావపరంపర, ధారాళమైన కవిత్వము, అన్నిఁటిని మించిన సందర్భోచిత ప్రతిభా ప్రదర్శనము ప్రతి పదమున గానవచ్చుచుండును.

నామజపము నామస్మరణము నను రెండును భగవదనుగ్రహాభిలాషి యగు సాధకునకు నుత్తమములగు సాధనములు. అర్థవిరహితమై యుండు జపముకన్న విదితార్థమై, భక్తిభావ సంపోషకమై యుండు నామస్మరణము సాధకున కధికముగ నుపకరించును. ఇట్టి స్మరణమున మనోవాక్కాయములు మూడును నేకీభవించును. దృశ్యము, ఊహ్యము, చింత్యము భగవంతుఁడేయైన సాధకుఁ డుత్తరోత్తర పరిణతిఁ

గొంచును. వాఁడు చతుర్విధముక్తులను జేపట్టుననుట తథ్యము. దీనికంతకును ప్రధానము ఆత్మజ్ఞానము. శివనాదు విషయకమగునట్టి యత్మజ్ఞానమును సామాన్యముగాఁ గాక, ఉదాత్తభావ సంశోభితముగాఁ బడయఁగోరు భక్తుల కిది కరదీపికవలె నుపకరించును — మఱియు శివనామములకు శ్రీ శర్మగారు గావించిన వివృతి రమ్యమై యుండుటయేగాక, భక్తిభావ విలీనుఁడై తన్మయుఁడైన సాధకుని భావములు గంభీరములు, సూక్ష్మములునై వాక్కులకుఁగూడ వర్ణింపఁజాలక నివృత్తిచెందు మార్గమున (యతోవాచో నివర్తన్తే) నగ్రేసరములై భాసిల్లుననుటను సూచించుచున్నవి.

ముక్తిదాయకము, శాంతి సంధాయకము, సుఖోపాయనకము నగు భగవన్నామ స్మరణము ఏతాదృశ గ్రంథపఠనమున మహోజ్వల ఫలదాయకము కాఁగలదు. శ్రీ శర్మగారిట్లే విష్ణుపారమ్యబోధకములగు నామములకుఁగూడ పద్యరూప వివృతిని రచియించిన, సంసారాబ్ధి తితీర్షువులగు సాధకులకు, భక్తులకు వెనలేని మేలొనఁగూర్చిన వారగుదురని తలఁచుచున్నాను.

సముపార్జిత విత్తమునకు త్యాగరక్షణమే రక్షణము. ఇట్టి సద్భావ మ్మందఱికిని యలవడదు. అదియు పురాకృత సుకృతమె. ఇట్టి ఉత్తమగ్రంథ ప్రకాశనమునకయి సహాకరించిన ఉదారశీలురు, భక్తులు నగు శ్రీ శివశ్రీ యల్ల బసవరాజుగారికిని, వారి కుటుంబమునకును శ్రీభీమేశ్వరుఁడు ఆయురారోగ్య ఐశ్వర్యముల నిచ్చి రక్షించుగాత!

ఇతిశమ్

మన్మథ<br>ఆశ్వయుజము }

బులుసు సూర్యప్రకాశ శాస్త్రి

---

శ్రీ మహాత్రిపురసుందర్యై నమః.

# మున్నుడి

శ్రీకాకుళపురేశాన కోణమునందు శ్రీ భీమేశ్వరాలయము కలదు. ఆ దేవాఁటిదో తెలియు సాధారములు లేవు బహు పురాతనము. నేలమట్టమునకు నిలువు లోతున గర్భాలయమందు, స్వర్ణరేఖామయ పృథుళస్నిగ్ధ కృష్ణశిలానిర్మితమైన యా లింగమూర్తి కడుంగడు నాకర్షణీయము. నలువదియేండ్లనుండి ప్రత్యేక సోమదినమున నా యథాశక్తి పూజ నందుకొను చుండును.

ఈ భాద్రపదమున నొక రేయి నేను నా శివమందిర ముఖమంటపమునఁ గూర్చుండి యేదియో వ్రాయుచుండినట్లు కలఁ గంటిని. మేలుకొని యీ సుఖకర స్వప్నము శివానుగ్రహకారణమని మురిసి స్వప్నానుగుణముగా నా శివుని గొన్ని పద్యములతో నుతించు కుతుకము నొందితి, సంతేకాని తన్ను నుతింపుమని యా దేవుఁడు నన్ను శాసింపఁగా నైన రచన మిదికాదు.

వ్రాయఁబూనియుఁ బరమశివుని పారమ్య మహిమాదు లెవ్వియో స్వకపోల కల్పితములుగా వ్రాయుటకంటెను, శైవాగమోక్త శివాష్టోత్తర శతనామావళికిం బరమార్థ వివరణమను నెపమునఁ బద్యములల్లుటే జిజ్ఞాసువులగు పాఠకులకును, భక్తులకును బరమోపకారకమని యెంచి యదియు శివాజ్ఞయే యని చేసిన కూర్పిది. అర్థజ్ఞాన రహితమైనది నామోచ్చారణము, సహితమైనది నామస్మరణము. అర్థజ్ఞాన రహితోచ్చారణము, తాను కొట్టు గంటలవలన గడియారమునకును, దాను పాడు పాటవలన గ్రామఫోను రేడియో పెట్టెలకెంత యానందము గలుగునో యంత యానందమునే యీయఁగలదు. భగవన్నామస్మరణమును మంత్రజపము అర్థజ్ఞానము లేక చేయఁబడినపుడు ఫలప్రదములు కానేకావా? యందురేని, కె గి చెప్పి, పైపెచ్చు భారద్వాజాదులును భాసురానందాది మహాపండితులును నిందించిరి. కొందఱు మాత్రము మోమోడి ఛాయామాత్రఫలప్రదము లనిరి. మంత్రమేని నామమేని యర్థజ్ఞానముతో నుపాసింపఁబడినపుడే భగవంతుని పారమ్య మహిమాదులు బోధపడి, మహావాక్యార్థ సమన్వయముతోడి యుపాసనమయి పరమపురుషార్థప్రదము కాఁగలదని మహాత్ముల యుపదేశము, గావుననే పరమేశ్వర సహాయముతో నామ పరమార్థమును వెల్లడించు పద్యములుగానే వ్రాసితిని. ఈ ప్రయత్నము తద్జ్ఞుల వినోదమునకుఁ గాకపోదని నా నమ్మిక.

నా కోరికనుబట్టి యీ చిన్నికృతికిఁ బీఠికవ్రాయు శ్రమ గొనుటేకాక, దీని సుందరముద్రితాకారము నొందించుటకును దోడుపడిన — తెనాలి వాస్తవ్యులును, సాధన గ్రంథమండలి నిర్వాహకులును నగు, బ్రహ్మశ్రీ విద్వాన్. బులుసు సూర్య ప్రకాశశాస్త్రిగారి మేల్కొఱక శ్రీ మాతను, వారి కాయురారోగ్య సంపత్సుఖముల నిచ్చి నిరంతరము రక్షించుఁగాత! అని ప్రార్థించు చున్నాఁడను.

శ్రీకాకుళము<br>
మన్మథ ఆశ్విన శు ౩ లు<br>
సోమ దినము

రచయిత :

శ్రీ శ్రీయానందనాథుఁడు

# మనవి

పరమశివుండు నా హృదయపంకజమందున నెట్టి భావవి
స్ఫురణము చేసెనో, యటులె చుల్కనిమాటల వ్రాసినాఁడ, నా
పొరపడినట్టి చోట్ల గుణపూజ్యులు చూపిన, మాఱుకూర్పునన్
సరదుకొనంగలాఁడ, నిదె సాయముకోరెదఁ బండితావళిన్.

— గ్రంథకర్త

☛ వెలువడనున్న నా గ్రంథము లెవ్వరేని బ్రకటింపఁబూనువారు, నాకు వ్రాసి కనుగొనవచ్చును. ధనాశ లేదు.

—♦—

## ప్రకాశకులు.

శివశ్రీ, చి॥ యజ్జ బసవరాజుగారు శైవాద్వైతి. నా ప్రియతమ శిష్యుఁడు. శాంభవదీక్షాశాలి. దైవిక రాజకీయములు ప్రతిబంధింపనిచో, నిత్యగురుసందర్శనమును, అవకాశమునుబట్టి కొన్నినిముషములైనను ఆధ్యాత్మికగోష్ఠి చలుపుటయు నీతని వ్రతము.

ఒకనాఁడు నాశిష్యుల కీగ్రంథమును నేను వినుపుచుండ, సద్దుమై విని యానందించి, యిట్టి రచనములే జిజ్ఞాసు పరమోపకారులనుచు, దీని ముద్రణ భారమును నాపైనిబెట్టి పరమశివానుగ్రహమునకును బండితాశీస్సులకును సఁబాత్రునిఁగాఁజేయు మని కోరెను. కడు వివేకి, చక్కని యెత్తుకాఁడునైనవాఁడు యశశ్శ్రేయములు భగవత్కృప సంపాదించు వారలే చూచుకొంచుఁ దరుణ మిచ్చినఁ గొల్పోవఁడు.

నా గ్రంథములలో నొకదాన వ్రాసికొన్న,

"నాచేతన్ భవదీయసత్కృతులె పన్నంజేయుమా; తత్కృతుల్
నీచాలంబము నొందకుండఁ గనుమా; నీభక్తులం జూపుమా,
ప్రాచుర్యమ్మునకంపుఁ జేయు మనవుల్ వ్యర్థమ్ముగాకుండఁ దా
నే చూపెట్టుము శుద్ధచిత్తుని జగన్నిర్మాతృ సత్శ్రేమతోన్"

"వ్రాయుట నాదువంతు; అది భక్తవరుల్గని మెచ్చ నచ్చులో
వేయుఁగఁజాలు పుణ్యు వెనువెంటనె నిల్పుట నీదువంతుగా
నేయలవాటు చేసితి వికేటికిఁ జింతలు; అమ్మ మేప్ర న
ళ్ళాయుకిఁ జేయి యంటగునె, భక్తసురద్రుమ! దేవి! శాంభవీ!"

యనెడి, కృతజ్ఞతానుత్యనుపారము గా భక్తుఁడు, శిష్యుఁడు పరమశివ కృపాదృష్టిలో నున్నవాఁడు పూనుకొంట కానందించి, సత్కృతి కర్తకును దత్కృతి ప్రకాశకునకును సమఫలమనియెతింగిన యీచతురమతి కవకాశమిచ్చి, పరమశివుఁడు వీరి యిల్లు వేయింట్ల నెందలుగాఁజేసి నిరంతరాయురారోగ్య సంపత్సమృద్ధితో నెనరు చూపుఁగాత మని యాశాసించుచున్నాఁడను.

శ్రీ శ్రీకాకుళము.
మన్మథ, ఆశ్వీన శు. ద్వితీయ
సోమదినము.

శ్రీ శ్రియానందనాథుఁడు,
ఈశ్వర సత్యనారాయణ శర్మ.

---

శ్రీ సూర్యనారాయణ పరబ్రహ్మణే నమః

# గ్రంథపరిచయము

శ్రీ. వే. శ్రీ శ్రియానందనాథాపరనాములు, ఈశ్వర సత్యనారాయణ శర్మగారు, ప్రతి సం॥ ఏదేనొక యాధ్యాత్మికగ్రంథ ప్రచురణము చేయుచు, భక్తసాధక కవి పండిత లోకమునకుఁ జిరపరిచితులైనారు. వారు వ్రాసిన సౌందర్యలహరి, శ్రీ దేవీ పంచస్తవ్యాదుల యనువాదములును, స్వతంత్ర కృతులైన అమ్మతో ముచ్చటలు, బాలాంబికా శతకము, శ్రీ సూక్త రహస్యార్థము, పుత్రవతీ హితోపదేశములు మున్నగునవి యమూల్యములును లోకోపకారములు ననుటకు ఆయా రచనములపై నభిప్రాయముల నిచ్చిన బుధులతోఁబాటు నేనును నెఱుఁగుదును.

శ్రీవారితోడి ప్రస్తావవశమున, ఈ శరన్నవరాత్రములకుఁ గూడ నొక గ్రంథము సిద్ధమైనట్లు విని, దాని వినఁగోరి పద్యము లాలించితిని. అది శ్రీ భీమేశ్వర నతి యనెడి పేర వెలయు శ్రీ శివాష్టోత్తర శతనామ పరమార్థ బోధకమగు కూర్పు. ఇంతేల, నది యానామావళికిఁ బద్యరూప భాష్యమన నొప్పుచున్నది.

భక్తులు తామారాధించు దేవతను గారణబ్రహ్మముగా భావించి, యుపచారములు చేయునపుడో, తదితర వేళలందో నామోచ్చారణము చేయుచుందురే కాని

నాము పరమార్థముల నెఱింగి చేయువా రరుదు. అర్థజ్ఞానమును, విశేషించి పరమార్థ జ్ఞానమును లేనప్పుడది యుచ్చారణమే కాని, నామస్మరణ మనంబడదు. దాని వలని ఫలమును వెలితియని నా విశ్వాసము.

శ్రీవారు, ఈ యభిప్రాయముతోనే, తాము మున్ను వ్రాసిన కాసీశ్వర శాలాంబికా శతకాదులవలెఁ గేవల భక్తిరస పూరితములగు స్వతంత్రపు టూహలతో మాత్రమే గాక, యీ గ్రంథరచనమందు గ్రోత్తదారి త్రొక్కి, కారణబ్రహ్మమైన శివుని 108 శైవాగమోక్త నామములను గ్రహించి, ప్రతినామమునకును బరమార్థమును హృదయంగమముగా వెల్లడించిరి.

వెలికిఁ బౌరాణికార్థము మాత్రమే స్ఫురించు, పినాకి, విష్ణువల్లభ, శితికంఠ, కపాలి, అంధకాసురసూదన, కామారి, భుజంగభూషణ, మృగపాణి, ఖండ పరశు, దక్షాధ్వరహర, త్రిపురాంతక, గిరీశ, గిరిశ, వీరభద్ర, పూషదంతభిద్, భగనేత్రభిద్, గిరిప్రియ మున్నగు నన్నిటికిని బ్రహ్మపరముగా వీరు వ్రాసిన పరమార్థములు శ్లాఘ్యములు, మనోహరములునై శ్రీ శర్మగారి పాండిత్యమును, ఉపాసనబలమును వేనోళ్లఁ జాటుచున్నవి. అవి యివి యన నేల? ప్రతి పద్యము పాఠకుల హృదయ శిరః కంపమున కగును.

ఇంకను వీరు వ్రాసిన "సిద్ధాంత శిఖామణి" (శైవాద్వైత సిద్ధాంతము) చండీ సప్తశతీ వివరణము, శ్రీవిద్యాభాష్యము మున్నగునవి యముద్రితములైయున్నవి. అవి లోకమున కెంతలో నందింతుమోయని యెదురు చూచుచున్నాము.

ఈ గ్రంథ ముద్రణ వ్యయభారమును వహించిన శివశ్రీ, యజ్జు బసవరాజుగారు భాగ్యవంతులు. సద్గ్రంథ ప్రకాశకులు గ్రంథకర్తతో సమానఫలము నందుదురని పెద్ద లందురు. పరమశివ కృపాదృష్టిలో నిల్చిన వీరికి భాగ్యము పట్టుట యుదాహరము.

గ్రంథకర్తకును, ప్రకాశకులకును శ్రీ సూర్యనారాయణస్వామి యాయురారోగ్యైశ్వర్యముల నిచ్చి సతతము సాకుఁగాత మని ప్రార్థించుచు, అయాచితముగా నీ పరిచయ వాక్యములను, నాయానందము పట్టలేక వ్రాసి పంపినందులకు నను మన్నించి యాదరింప శ్రీ శర్మగారిని వేడుచున్నాను.

ఇట్లు
విద్యాభాస్కర
ఇప్పిలి వెంకటరామశర్మ

అరసవల్లి
10-10-55



# కృతి సమర్పణము

ఏ భీమేశ్వరునాలయ ముఖమంటపమున గూర్చుండి

యేదో వ్రాయుచున్నటులు కలగనుటే

యీ రచనమునకుఁ గారణమయ్యెనో,

యా భక్తవత్సలునకే, ఆ శ్రీ భీమేశ్వరునకే

శివాష్టోత్తర శతనామార్థజ్ఞానముతో

నీ కృతి సమర్పితము.

— మన్మథ - భాద్రపద శు ౧లు.

## శ్రీ శివాష్టోత్తర శతనామావళిః

శివో మహేశ్వరః శంభుః పినాకీ శశిశేఖరః

వామదేవో విరూపాక్షః కపర్ద్దీ నీలలోహితః॥

శంకరః శూలపాణిశ్చ ఖట్వాంగీ విష్ణువల్లభః

శిపివిష్టోఽంబికానాథః శ్రీకంఠో భక్తవత్సలః॥

భవః శర్వస్త్రిలోకేశః శితికంఠః శివాప్రియః

ఉగ్రః కపాలీ కామారి రంధకాసుర సూదనః॥

గంగాధరో లలాటాక్షః కాలకాలః కృపానిధిః

భీమః పరశుహస్తశ్చ మృగపాణి ర్జటాధరః॥

కైలాసవాసీ కవచీ కఠోర స్త్రిపురాంతకః

వృషాంకో వృషభారూఢో భస్మోద్ధూలిత విగ్రహః॥

సామప్రియః సర్వమయ స్త్రయీమూర్తి రనీశ్వరః
సర్వజ్ఞః పరమాత్మా చ సోమసూర్యాగ్ని లోచనః ॥
హవి ర్యజ్ఞమయః సోమః పంచవక్త్రః సదాశివః
విశ్వేశ్వరో వీరభద్రో గణనాథః ప్రజాపతిః ॥
హిరణ్యరేతా దుర్ధర్షో గిరీశో గిరిశోఽనఘః
భుజంగభూషణో భర్గో గిరిధన్వా గిరి ప్రియః ॥
కృత్తివాసాః పురారాతి ర్భగవాన్ ప్రమథాధిపః
మృత్యుంజయః సూక్ష్మతను ర్జగద్వ్యాపీ జగద్గురుః ॥
వ్యోమకేశో మహాసేన జనక శ్చారు విక్రమః
రుద్రో భూతపతిః స్థాణు రహిర్బుధ్న్యో దిగంబరః ॥
అష్టమూర్తి రనేకాత్మా సౌమ్యశ్చ శుద్ధవిగ్రహః
శాశ్వతః ఖండపరశు రజః పాశవిమోచనః ॥
మృడః పశుపతి ర్దేవో మహాదేవోఽవ్యయో హరిః
భగనేత్ర భిదవ్యక్తో దక్షాధ్వరహరో హరః ॥
పూషదంత భిదవ్యగ్రః సహస్రాక్షః సహస్ర పద్
అపవర్గప్రదోఽనంత స్తారకః పరమేశ్వరః ॥

ఇతి శ్రీ శివాష్టోత్తరశతనామ స్తోత్రమ్.

ఏవ మష్టోత్తర శతం నామ్నామామ్నాయ సమ్మితమ్
శంకరస్య ప్రియా గౌరీ జప్త్వా త్రైకాల్య మన్వహమ్ ॥
చోదితా పద్మనాభేన వర్ష మేకం ప్రయత్నతః
ఏతై రష్టోత్తర శతై ర్నామభి స్త్రీవా జన్మని ॥
స కృద్వా పూజయే చ్ఛంభుం కులకోటిం సముద్ధరేత్
బిల్వపత్త్రైః ప్రశస్తైర్వా పుష్పైశ్చ తులసీదళైః ॥
తిలాక్షతైర్యజే ద్దేవం జీవన్ముక్తోఽర్థవిద్భవేత్
నామ్నా మేషాం పశుపతే రేకమేవాపవర్గదమ్ ॥
అన్యేషాం చా వశిష్టానాం ఫలం వక్తుం న శక్యతే ॥

ఇతి శ్రీ శివరహస్యే గౌరీనారాయణ సంవాదే
శ్రీ శివాష్టోత్తర శతనామస్తోత్రం
సంపూర్ణమ్.

ఓం

# శ్రీ భీమేశ్వర నుతి

## (శివాష్టోత్తరశతనామ పరమార్థబోధకము)

### 1. ఓం శివాయ నమః

భవదాఖ్యాసుమమాలలోని శివపుష్పంబే, పరానంద రూ
ప విశిష్టుండవు, నిర్వికారుఁడవు, సద్భక్తాళి కల్యాణ దా
తవు, సన్మానసవాసి వంచుఁ దెల్పున్; దచ్చింతనం బల్పమా?
భవదుర్వాసన మాపు పూవదియె సాంబా! దేవ! భీమేశ్వరా!

### 2. ఓం మహేశ్వరాయ నమః

సురసందోహము నిన్ను శ్రేష్ఠతముఁ డంచున్ స్తోత్రముల్సేయ, ఈ
శ్వరతన్ శ్రేష్ఠత సంఘటిల్లఁగ, భజత్సంఘాతముల్ నిన్మహే
శ్వరుఁడంచుం గొనియాడు; ప్రొక్కెదను సంభావించి తత్సంజ్ఞతో
నిరతంబున్నిను భక్తకల్ప! శ్రితనందీ! దేవ! భీమేశ్వరా!

### 3. ఓం శంభవే నమః

పరమానందమయుండ వీవనుచు, నీవల్లన్ సుఖావాప్తి చే
కుఱు భక్తాళికటంచుఁ, బల్కకయ పల్కంగాదె, నీ శంభునా
మరహస్యంబు; తదాఖ్యతోఁ బిలిచి సంభావింతు నిన్నెప్పుడున్;
పురుహూతాద్యమరార్చితాంఘ్రియుగ! శంభో! దేవ! భీమేశ్వరా!

### 4. ఓం పినాకినే నమః

శరజాలోద్గత వహ్నికీలల మహాశ్చర్యంబుగాఁ గప్పెఁ ద్రై
పురమే చాపమదే పినాకమనుచుం బొల్పారెఁ; దత్స్వీకృతిన్
హర! నీవైతి పినాకి నామపదముతో నర్చింతు; నాకింకఁ ద్రై
పురసంబంధము వాపి యేలు మిదె మోడ్పుల్ నీకు భీమేశ్వరా!

అననో యా త్రిగుణాత్మ శక్తి సతముల్ స్వాధీన నాకంచు, నా
తనువే త్ర్యర్ణవిశిష్టమోంకృతి యథార్థంబంటకో, యాస్థతో
నను సేవించెడి వారికిం ద్రిపురసన్తాపంబుఁ జల్లార్తు నే
నననో, నీవు పినాకివైతివిటు బ్రహ్మాకార! భీమేశ్వరా!

5. ఓం శశిశేఖరాయ నమః

ఈవిన్నే భవదీయ కేశతతిగా, నీచంద్రుఁడే నెత్తిపైఁ
బూవుం దండగ నెన్ను సత్కవి మహాబుద్ధిన్విచారింపఁగా
నీ విశ్వాకృతి పైకి నంతదనుకన్ సిండారు నంటే కదా
దేవా! నీ శశిశేఖరాభిధకు నేదీ విల్వ? భీమేశ్వరా!

6. ఓం వామదేవాయ నమః

భవనీయంబగు వామపార్శ్వమయి నీ వామాంగి రాణించుటన్
స్తవనీయంబగు శ్రేష్ఠతం దనరె, విశ్వంబు న్వాలిం గ్రక్కుటన్
నవరుల్ దీప్తియుఁ బొల్పు వాఁడవగుటన్, సర్గాదిక క్రీడలన్
భవ! నీవాటను, వామదేవ! యని సంభావింతు, భీమేశ్వరా!

7. ఓం విరూపాక్షాయ నమః

నెలయుం బ్రొద్దును నిప్పు మూఁడు కనులై నెక్కొంటచేఁ గాలసూ
చులు నీకంగములంట సిద్ధమయి పొల్పున్; కాలము న్మీఱువాఁ
డల శంభుండను నర్థమిచ్చును; విశేషాకారముల్ మీఱ నీ
కలరెం గన్నులు గన్క సార్థము విరూపాక్షాఖ్య; భీమేశ్వరా!

8. ఓం కపర్దినే నమః

సురవర్త్మాఖ్యము కార్ణవాచ్యము, జటాజూటంబు పెన్నిటితోఁ
బరమానందముతోడఁ బూర్ణమగుటన్, భాసిల్లు నీపేరిలోఁ
బరమార్థమ్ము నెఱుంగువారు కడు సన్వర్థంబుగా నెంచి, సు
స్థిరభక్తి న్నుతియింత్రుగా నినుఁ గపర్ది! యంచు, భీమేశ్వరా!

9. ఓం నీలలోహితాయ నమః

గరళంబుఁ దిగ్రమ్మింగ కుంఠ కమునఁ గంఠంబునందాల్చి నీ
లరుచిం బొల్పుటచేత, నీదు జడలన్ లౌహిత్య మేపారఁగన్
పరిగా భక్తులు నీలలోహితుఁడు నా సార్థక్యమొప్పారు న
వ్వర నామంబు స్మరింత్రు సంతతము, శర్వా! దేవ! భీమేశ్వరా!

లలితస్వచ్ఛతమార్గము ల్వెలయు నీలచ్ఛాయతో; నీది కే
వలమచ్ఛత్వము గాన నీలరుచిగా భావించి, నీయందు ని
శ్చలయౌ నీదు విమర్శశక్తికి క్రతుశ్రద్ధ శ్రేణి లౌహిత్యమున్
దలఁప న్నీకగు నీలలోహిత లసన్నామంబు, భీమేశ్వరా!

10. ఓం శంకరాయ నమః

శార్ణమ్మెన్న సుఖార్థకం, బది భవత్సంసేవచేఁగల్గు; త
త్పూర్ణావాప్తి యిహామ్మునం బరమునందుం గూర్చుచున్ దుర్భవో
త్తీర్ణత్వంబు ఘటింప శంకరుఁడు నా దివ్యాఖ్య నీకే చనున్;
స్వర్ణాగప్రవరాసనా! శ్రితసుఖప్రాలంబ! భీమేశ్వరా!

11. ఓం శూలపాణయే నమః

త్రిగుణద్యోతకశక్తి నాదని, త్రిమూర్తిత్వంబు నాదంచు, మూ
డగు వర్ణమ్ముల నొప్పు నోంకృతియు నా యకారమం, చుగ్గడిం
పఁగ మూఁడౌ మొనలొప్పు శూలమును నీపాణిన్ ధరింపంగ నొ
ప్పుఁగదా, భక్తులు శూలపాణి! యని నిన్పూజింప, భీమేశ్వరా!

12. ఓం ఖట్వాంగినే నమః

నరు పుర్రెన్ గొనఁ గ్రుచ్చ భీకరమునై నైశిత్య మేపారు ని
ష్ఠురఖట్వాంగము పేరి శూలమున గోడున్ దుష్టదైత్యాళికిన్
వరవైరాగ్యము శిష్టకోటికి నొనర్పంగల్గె ఖట్వాంగి యం
చురుతౌ నామము; వింత నీదు చరితమ్మూహింప, భీమేశ్వరా!

13. ఓం విష్ణువల్లభాయ నమః

జగతీత్రాణము, పాలనాంతకర కర్మద్వంద్వ సాపేక్ష లే
కగునే? ఆ పురమర్దనక్రియను దా నమ్మాయ విష్ణుండు ని
ల్వంగ నీవింటను, నీకుఁ బుణ్యవరవాల్లభ్యంబు సంసిద్ధమే
యగుటన్, సార్థము విష్ణువల్లభసమాఖ్యాసిద్ధి, భీమేశ్వరా!

14. ఓం శిపివిష్టాయ నమః

శిపులే రశ్ములు, వాని వ్యాప్తినగు వైశిష్ట్యమ్ముతో నొప్పుటన్,
శిపులన్నన్ భవబంధలగ్నులగు నీ జీవుల్ పసుల్, వానియం
దెపుడున్ వ్యాప్తుఁడవై రహించుటను, సర్వేశా! తగె న్నీకు నా
శిపివిష్టాఖ్య; తదర్థభావమున నిన్ జింతింతు, భీమేశ్వరా!

15. ఓం అంబికానాథాయ నమః

పాథాబ్జానలనేత్ర! సర్వజగదంబాఖ్యాతిఁ గొంచున్, జగ
న్నాథా! నీ పని చేయు శక్తియయి, అర్ణప్రఖ్యనొప్పారు నా
నాథుం డిట్టిఁడటంచుఁ గ్రక్కు నుమకు న్నాథుండవై, యంబికా
నాథాఖ్యం గొను నీదు తత్త్వమెఱుఁగన్ శక్యంబె? భీమేశ్వరా!

16. ఓం శ్రీకంఠాయ నమః

ఆ కంఠిన్ గిలకొట్టువేళ నట సద్యఃప్రాణహృచ్ఛక్తితోఁ
గాకోలమ్ముదయింప మ్రింగి, జగతన్నావంగ నీ కంఠమం
దే కూర్పంగఁ దదీయశోభ తోడవై దీపింపఁగానైన నీ
శ్రీకంఠాఖ్యఁ దలంచినన్ దొలఁగదే శేషంబు? భీమేశ్వరా!

శ్రీకారావయవమ్ములే తెలియఁగాఁ జెప్పన్ సుఖజ్ఞానముల్
స్వాకారమ్మగు నీదు శక్తి; నది నీయానల్ తలం దాల్చుచున్
నీ కృత్యమ్ముల నైదిటిన్ జలువుచు న్నీకంఠమం దుండుటన్
శ్రీకంఠాభిధ నీకుఁ జెల్లదలె? లక్ష్మీనాథ! భీమేశ్వరా!

17. ఓం భక్తవత్సలాయ నమః

ఈఁగన్ బ్రాలఁగనీమ మేనిపయి గో, వీట్టే పొదిం జేఁపుచున్
లేఁగన్నాకుచు వేయికన్నులు గలట్లే కాచు; నీ యజ్ఞ శ్ర
ద్ధాగర్భంబుగఁ గొల్చు భక్తునెడ వాత్సల్యంబు నీకట్టులే
బీగల్ సాగఁగ భక్తవత్సలుఁడనన్ దీపింతు, భీమేశ్వరా!

18. ఓం భవాయ నమః

సకలస్థావర జంగమాత్మక జగజ్జాలంబు నీవౌచు, నం
దొక రవ్వంతయు నీవు లేనిదయి లేకుండన్, శ్రుతిజ్ఞుల్ భవ
ద్రుకుతారంబగు నీ భవాఖ్య సత మాత్మస్యమ్ముతో నెంచి త
త్ప్రకటంబౌ నపవర్గసత్ఫలము సంపాదింత్రు, భీమేశ్వరా!

19 ఓం శర్వాయ నమః

ప్రచురానంత జగద్విధాతవగుటన్ బ్రహ్మాఖ్యతో, నీకె సృ
ష్టిచణత్వమ్మును బోషకత్వమును సంసిద్ధమ్ములే, యైనఁ బ్రా
పిచయాంతమ్ము తుయమ్ము వేళఁ జలుపన్, నీకైన యీ శర్వనా
మచమత్కారము సూరిచిత్తములకు న్మాన్యమ్ము, భీమేశ్వరా!

20. ఓం త్రిలోకేశాయ నమః

కానన్వచ్చును సర్వమెందు నదె లోకంబండ్రు; లోకమ్మనం
గా నీచిత్ర విచిత్ర సృష్టియు; త్రిలోకంబన్నచో లక్షణం
గా నీ రేడగు వానికింతయును నీయైశ్వర్యమే యాటచే
కేశః సంహార! నీకె చెల్లును త్రిలోకేశాహ్వ, భీమేశ్వరా!

21. ఓం శితికంఠాయ నమః

రక్షంబున్ దిగమ్రింగునంతకును నీ కంఠమ్ము సాజమ్ముగాఁ
రఁగన్ దెల్పయి; నాటఁగోలె నలుపై భాసిల్లెనన్మాట, నీ
రనామమ్ముల నొక్కదాన నిముడింప న్పండితుల్ బుధిచా
లరితో నిక్ శితికంఠుఁడందురు, బుధస్తుత్యాఖ్య! భీమేశ్వరా!

22. ఓం శివాప్రియాయ నమః

అవలా నామక, నీక భిన్న, శ్రితభద్రాపాదనోద్యుక్త, సృ
ష్ట్యవనాంతాది కృతిప్రసిద్ధ, సతి, యవ్యాజాను కంపాబ్ధియున్
శివసంవిత్ప్రద, సర్వమంగళ, నినున్ బ్రేమించుటన్ మాకు విం
తవునే నీదు శివాప్రియాఖ్య కడు హృద్యంబౌట, భీమేశ్వరా!

23. ఓం ఉగ్రాయ నమః

వ్వవిధుల్ నీకు వెఱంగి నేమమున నిర్వర్తించు సూర్యోదురా
ద్దివిజేశాదుల కుగ్రమూర్తివి, సురద్విట్కోటికుగ్రుండ, వీ
భువనవ్రాతము లోఁగొనం గడఁగుచోఁ బూర్ణోగ్రతన్ జూపువాఁ
డవు నాటన్ భవదుగ్రనామము కవీడ్యంబయ్యె, భీమేశ్వరా!

24. ఓం కపాలినే నమః

అగురా! నీవు కపాలివౌట కలనాఁడా నల్వ శీర్షమ్ముఁ జి
ద్మగ శాపాహతి హేతువందురు; యథార్థంబెన్న, యోగస్థితిన్
విగలత్ స్వాత్మసుఖామృతార్తవను నీ నిక్కంబుఁ దెల్పంగ, గు
ర్తుగ నీ చేతి కపాలముం దలఁపరాదో? దేవ! భీమేశ్వరా!

25. ఓం కామారయే నమః

కామింపన్ జగతీవిసర్జనకృతిం గామాఖ్యయున్, భక్తితో
నేమంబొప్పఁగఁ గొల్చువారి తములం దీర్పంగఁ గామప్రదా
వ్వమాన్యత్వము, యోగవైరి యగు కామామిత్రు దోరించుటన్
గామారిప్రథఁబొల్చు నీకిదె నమస్కారంబు, భీమేశ్వరా!

26. ఓం అంధకాసురసూదనాయ నమః

మును దోరించితి వంధకాఖ్యు నసురన్ బో, కాదనన్; నామదిం
గనఁగా, నంధకమా నవిద్య నసురన్గా నెంచి, తత్సూదనం
బన నీచేతిదటంచుఁ బ్రాజ్ఞవరు లూహాం జేసి, యోగ్యావ్యాయ
మ్మని, నిన్నంధకసూదనా! యనిరి, జ్ఞానాకార! భీమేశ్వరా!

27. ఓం గంగాధరాయ నమః

హరిపాదోద్భవ శీర్షధార్య యనియో, యా యుర్వడిం జాలినో
ధరణీహాని నెఱింగియో, యలికనేత్రప్రోద్భవ జ్వాలికా
ఖరతాపంబు నడంచికోనో, తల గంగన్దాల్చినా, వర్ణ్యమై
వరగంగాధర సంజ్ఞ నీకె తగు, దివ్యస్థామ! భీమేశ్వరా!

సరితాంభ ర్తను నీస్వరూపమని పూజిల్సేయుటన్, జంగమా
చరరూపంబగు నీదు మేన గగనాసారంబుల న్దాల్చుటన్
హరిపాదోద్భవ శీర్షధార్య యను సమ్యగ్గౌరవం బుంచుటన్
వరగంగాధర సంజ్ఞతోడ నిను సంభావింతు, భీమేశ్వరా!

28. ఓం లలాటాక్షాయ నమః

కాలాకారుఁడ నేనన్ దిన నిశాకాంతు లక్షునందోయిగాఁ
జాలన్లేదో? మదీయరూపమె సుఁడీ సంధ్యాద్వయంబంచు నీ
వీ లోకంబెఱుఁగ న్గనంటఁ దెఱకన్నే పారఁగాఁ దాల్చితో
వ్యాలాలంకృత! సార్థమిందున లలాటాక్షాఖ్య, భీమేశ్వరా!

29. ఓం కాలకాలాయ నమః

కాలుండె నను డింకికొట్టు లయసంకల్పంబె నీకౌతటన్,
మేలౌ నీశ్వరభావహేతువు గదా నీకాలకాలాఖ్య; యిం
కేలా కాలునిభీతి, యానుదువుతోనే పిల్చి ధ్యానించి, ము
క్కాలంబు న్నినుఁ గొల్చువారికి? భజత్కల్పాగ! భీమేశ్వరా!

30. ఓం కృపానిధయే నమః

ఖలులున్ సాధులు నాక యెల్లర నొకే కంటన్ దయంజూతు భ
క్తుల, నీ వారణచర్మధారణము, శార్దూలంపుఁ దోల్దాల్పునన్,
గల హాలాహృతి ముఖ్యకృత్యములు తార్కాణంబులై యొప్ప, ని
ర్మల బుద్ధుల్ సుకృపానిధీ! యనుచు సంభావింత్రు, భీమేశ్వరా!

ఖలులన్ సాధుల నెల్లవారి సమదృక్పాతంబుతోఁ గాంతు; జీ
వులు నీ కళ్కలెగాన సంసరణ సంభూతార్తితోఁ గొల్చువా
రల నీలోనికె మళ్లి యక్షయకృపారమ్యుండవై చేర్చుకోఁ
దలఁపేగల్గు నినుం గృపానిధివనన్ దప్పేమి? భీమేశ్వరా!

31. ఓం భీమాయ నమః

దిననాథుండును వాయువున్ జ్వలనుఁడున్ దేవేశుఁడు న్దేవ శ
త్రునికాయమ్ము మను స్వాశ్రితాహితులు వీరున్వారు నానేల, ద
క్షినవున్ తేఁడుఁ ద్రిలోకి మిత్తియును నీకే యోడుటన్ భీమ సం
జ్ఞను నిన్ బిల్తు జగన్నియంత వగుటన్ సర్వేశ! భీమేశ్వరా!

32. ఓం పరశుహస్తాయ నమః

పరులున్ స్వీయులనంగ లేరెవరి నే బాధింపఁ జేకొంటివో
పరశుప్రఖ్యము వాలు? దానసగు తత్త్వంబెన్నఁగా, భక్తసం
సరణారణ్యముతోడఁ దద్రిపు వినాశంబే యభిప్రేతమౌఁ;
దరమా యీ నిరుకెన్నఁగాఁ బరశుహస్తా! దేవ! భీమేశ్వరా!

33. ఓం మృగపాణయే నమః

మును దక్షాధ్వరభంగవేళ మృగమై బోఁబొఅ యాగాగ్ని, దా
నిని బట్టన్ మృగపాణివై తివఁట; కానీ, నిక్కమే యైననున్
మనసుల్ లేఁడులు, నిగ్రహింపఁగలరా మద్భక్తు, లామేలు నా
పని యంచుం దెలుపంగఁబట్టినటు నే భావింతు, భీమేశ్వరా!

34. ఓం జటాధరాయ నమః

జటయు ల్లల్లికగొన్న మూడు గొనముల్ స్వాకారమౌశక్తిఁ దా
ల్చుటచే, సంసృతిభూమి రుడ్జటయు నీలో నాటచే, నిడ్వాలా
జటలన్ దాల్చుటచే, జటాధరుఁడు నా సార్థాభిధానంబు పొ
ల్చుట యబ్రంబబెు; అయభిఖ్యకు నమస్సుల్ దేవ! భీమేశ్వరా!

### 35. ఓం కైలాసవాసినే నమః

శివతోఁగైలము నీవు చల్వు గిరియే చెల్వారు కైలాస; మా
యవనీధ్రంబె, సుయోగికిన్ నిజసహస్రారాంతరం; బద్ది నీ
భవనం, బచ్చట నిన్ను సోమునిగ సంభావించి కైలాసవా
సివిగాఁ గొల్చి తరించు నాతఁడు సుఖశ్రీ యుక్తిఁ, భీమేశ్వరా!

### 36. ఓం కవచినే నమః

కవచం బన్నను మంత్రశాస్త్రమున హుంకారంబు; తద్ధాటివై
కవచిప్రఖ్య గడించి, తోంకృతియె నీ కాయంబు లెద్యుక్త, మా
కవచున్ ఫట్కృతిఁ జేర్చు జాపకుఁడు లోకంబందు సిద్ధికుఁడై
భవ! నీప్రేమకుఁ బాత్రుఁడై మనుట యబ్రంబౌనె? భీమేశ్వరా!

క యనన్ బ్రహ్మము; ఆ వచస్సె భవదాఖ్యాప్రాతినిధ్యంబు నొం
ది యొసంగన్ గవచంబు నాఁబరఁగె; ఆ దివ్యాభిధానంబు నీ
దయి యుంట న్గవచీ! యటంచు నిను వాహ్వానించుటన్ నీకుఁ బొ
ల్పయి వాక్పూజలకయ్యె నీ కవచి సార్థాభిఖ్య; భీమేశ్వరా!

### 37. ఓం కఠోరాయ నమః

పితవై, ప్రేమమయుండవై, జగముల న్వీక్షించు నీలోఁ గఠో
రతయా? నిన్నని చేరఁబూనుకొను ప్రారంభమ్మునన్ యోగసం
గతినా నక్రమసాధనమ్ము కొఱయై కాల్జాలు మందుల్ కఠో
రత నీకుం దగిలించి రంతె; అకఠోరా! దేవ! భీమేశ్వరా!

### 38. ఓం త్రిపురాంతకాయ నమః

త్రిపురుండే త్రిపురాంతకుండట ఖలే! దీన న్విచిత్రంబు లే
దు; పురాకారుల దైత్యుల న్గెడపుటన్, స్థూలాదులై నట్టి యీ
త్రిపురా ల్గూరెడి బాధ నీ శ్రితులకుం దీర్పన్ సుసార్థంబుగాఁ
ద్రిపురా! నీ త్రిపురాంతకాఖ్య వెలసెన్ దేవేశ! భీమేశ్వరా!

39. ఓం వృషాంకాయ నమః
ధనధాన్యంబులు మీకుఁబెంచు వృషమే ధర్మస్వరూపంబు సుం
ననన్నో, భక్తులు నన్నుఁగొల్తురు, తదీయ శ్రేష్ఠతన్జూచి పూ
జనముం జల్పెద వారికేను ననన్నో, సద్భక్తు నందీశు నం
కనముం జేసితి నీ సిడంబున? వృషాంకా! దేవ! భీమేశ్వరా!

40. ఓం వృషభారూఢాయ నమః
కమనీయంబగు వెల్లమెద్దుపయి నెక్కంగానె కాదోయి! శ్రే
ష్ఠములౌ భక్తవినిర్మలాత్మలుఁ జతుష్పాదంబు ధర్మంబుఁ బు
ణ్యామునన్ నీకు నధిష్ఠలమ్ము లగుటన్ సార్థంబు, భక్తామర
ద్రుమ! నిక్కమ్ముగనయ్యె నీకు వృషభారూఢాఖ్య, భీమేశ్వరా!

41. ఓం భస్మోద్ధూళితవిగ్రహాయ నమః
"విస్మేరాంశము కాదెయుంగుఁడిదె నావేసంబులోఁ గందువన్;
అస్మచ్ఛద్మము నర్థముం దెలిసి దేహాత్మభ్రమల్ వీసి, మే
భస్మంబౌటకె" యంచు మాకు దృఢమౌ వైరాగ్యము న్దెల్పనో
భస్మోద్ధూళిత విగ్రహుండవగు సద్భావమ్ము, భీమేశ్వరా!

42 ఓం సామప్రియాయ నమః
సామాంతః కరణమ్ము లెల్లెడుఁగు నీ సామప్రియాఖ్యార్థమున్;
సామాన్యస్తుతికంటె సామకృతగానంబే నినున్దన్పుటన్,
సామాచార, సుసామవాక్కులకె నీ స్వాంతమ్ము రంజిల్లుటన్
సామంబై వెలివుచ్చుదానికి నమస్కారమ్ము, భీమేశ్వరా!

43. ఓం త్రయీమూర్తయే నమః
శ్రుతులమ్మూడును నాస్వరూపమని, మూర్తుల్ మూడు నేనంచు, వ్యా
హృతులమ్మూడును నా స్వరూపమని, సూర్యేంద్వగ్నులమ్మూడు నా
ద్యుతులే యంచును, బూతమైన త్రయి యొందున్నాదు రూపంచు దె
ల్ప త్రయీమూర్తికి నీకొనర్తుఁ గయిమోడ్పుల్, దేవ! భీమేశ్వరా

44. ఓం సర్వమయాయ నమః

హర! యిచ్ఛాకృతి శక్తి రేఁగఁగ "బహుస్యా"మ్మంచు, నీవే చరా
చరసంపన్న జగచ్ఛరీరివయి, తీ సత్యమ్ముతోనే నిరం
తరముఁ సర్వమయా! శివా! యనుచు నీఁ ధ్యానించినన్ మాకు న
శ్వరసాయుజ్య మటంచు సద్గురుల శశ్వద్బోధ; భీమేశ్వరా!

45. ఓం అనీశ్వరాయ నమః

అవు శక్తుండును రాజు నీశ్వరుఁడు నా నర్థంబు, నిన్నేలు రా
జెవఁడు న్లేమి ననీశ్వరుండవయి, తింతేకాదు; నీ పాదవా
ర్భవము న్వీడక రాయిడిం చెడి మహాభక్తు న్వాలారించు స
త్తువ లేకుంట ననీశ్వరుండవయి తందు న్నిన్ను; భీమేశ్వరా!

46 ఓం సర్వజ్ఞాయ నమః

దినరాత్రిప్రభు లగ్నియు న్గనులుగా దీపించునంచున్, దలల్
కనులు న్నీకు ననంఖ్యమంచు, భవదాకారంబు జ్ఞానమ్మే యం
చును, విశ్వమ్మును మీఁజేయుందు వనుచున్ శ్రుత్యుక్తియైనప్పు డె
వ్వనికిం జెల్లును నీకుఁదక్క నిఁక సర్వజ్ఞాహ్వ; భీమేశ్వరా!

47. ఓం పరమాత్మనే నమః

జగతీసర్జన పాలనాంతముల క్షేమమ్మైన యత్నమ్మ నీ
దగుటన్, జీవులు పుట్టుచోటగుటచే, నిన్నింట వ్యాపించుటన్
జగదాకారము నొందఁగా మిగులు నైశ్వర్యంబు ముప్పావు నీ
వగుటన్నీకె సుసార్థమయ్యెఁ బరమాత్మాభిఖ్య, భీమేశ్వరా!

48. ఓం సోమసూర్యాగ్నిలోచనాయ నమః

దినమందున్ రెయి సందెలందవిరతిన్ దీరొప్పసౌ ప్రాణిక
ర్మనికాయమ్మున కీవు సాక్షితను సంపాదించి, తత్తత్ఫలం
బనుకూలమ్ముగ నీయఁ బూనుకొని కాదా, సోమసూర్యాగ్నిలో
చనముల్దాల్చితి వెంత నేర్పరివి, త్ర్యక్షా! దేవ! భీమేశ్వరా!

49. ఓం హవిషే నమః

ఏ తత్త్వమ్ములు నీవికారములయై యీ విశ్వమే యయ్యెనో
యా తత్త్వమ్ములనెల్ల, నీశ్రితుఁడు సత్యజ్ఞానియై వేల్చు నీ
జ్యోతీరూపము నందనంగనె, హవిస్సుల్ వహ్నియు నీవయై
ఖ్యాతిం జెందితివెల్లవోట్ల హవిరాఖ్యన్, దేవ! భీమేశ్వరా!

50. ఓం యజ్ఞమయాయ నమః

బ్రహ్మాకారము స్రుక్స్రువాదికము, నా బ్రహ్మంబె సోమాసి, యా
బ్రహ్మంబే హవిరర్థ, మగ్నులును నా బ్రహ్మంబె, ప్రాప్యంబు నా
బ్రహ్మంబే సవసర్వమంచు, శ్రుతి సంభావించెనన్నన్, శివ
బ్రహ్మంబా! తగె నీకు యజ్ఞమయ సార్థప్రఖ్య; భీమేశ్వరా!

51. ఓం సోమాయ నమః

క్రమసృష్టిన్ గుణయుక్తిఁజేయు నుమసాంగత్యమ్ము నిత్యమ్ముగా,
నమలస్వీయసహస్రపత్రమున యత్నానీతయౌ కుండలీ
రమణి న్నిన్నును జేర్చు సాధకు శరీరమ్మున్ సుధాసార సా
ర్ద్రముగాఁ జేయఁగ సోమనామకుఁడవై రాణింతు, భీమేశ్వరా!

52. ఓం పంచవక్త్రాయ నమః

తులకింతెంతయుఁ బంచవక్త్రుఁడఁగ సద్యోజాత ముఖ్యాస్యముల్
గలవేనాటఁ; జరాచరంబులను గ్రక్కంబూనువాఁ, డట్టులే
ప్రలయేచ్ఛం గొనువాఁ డవెల్ల మిగులం బంచమ్ములై యొప్ప, భా
సిలు నీ నామము పంచవక్త్రుఁడనగాఁ జిత్రంబె? భీమేశ్వరా!

53. ఓం సదాశివాయ నమః

నీరోగిత్వ చిరాయువుల్, యశము, నిర్నిద్రాద్వయ జ్ఞానమున్
భూరిప్రజ్ఞుల సేవ, యోగరతి, సత్పుత్రావాప్తియుం గూర్చి, స
ర్వారిష్టమ్ములఁ దూల్చి, భక్తులను నిత్యంబేలు ప్రేమాబ్ధి! నీ
కే రాణించు సదాశివాఖ్య కిదె నా కేల్మోడ్పు, భీమేశ్వరా!

## శ్రీ భీమేశ్వర నుతి

### 54. ఓం విశ్వేశ్వరాయ నమః

సకలాత్మా! త్రిగుణస్వరూపయగు నీ శక్తిక్షా జరస్థావరా
త్మక విశ్వాకృతిగాఁగ మాఱిచి, తదంత శ్చిత్స్వరూపంబుతో
సకలంబు న్నడిపించి, లోఁగొనెడి యైశ్వర్యంబు నీదాటఁ ద
ప్పక విశ్వేశ్వరసంజ్ఞ నీకె తగు నప్పా! దేవ! భీమేశ్వరా!

### 55. ఓం వీరభద్రాయ నమః

అనఘుండెవ్వఁడు పూర్తిగా లయము పూర్ణాహాంతలో నిదం
తను జేయంగఁ బరాక్రమించు, నతడే ధాత్రి న్మహావీరుఁ, డా
తనికే భద్రము పేరి మోక్షమును సంధానించుటన్, స్థాణ్వై
తనరె న్నీకిల వీరభద్రుఁడను స్తుత్యప్రఖ్య, భీమేశ్వరా!

### 56. ఓం గణనాథాయ నమః

ప్రమథుల్ నీ సభ నందిముఖ్యులును, రుద్రప్రఖ్యులున్ సాధ్య వి
శ్వ మహారాజిక భాస్వరాది గణ దేవవ్రాతముల్, మాతృవ
ర్గము, నీ నాథత నొంది నీకు పరిచర్యల్సేయు వారౌట, యో
జ్యము నీకే కద, దేవదేవ! గణనాథాభిఖ్య, భీమేశ్వరా!

### 57. ఓం ప్రజాపతయే నమః

పిత వీ విశ్వచరాచరాళి కగుటన్, విఖ్యాతిమీఱం బ్రజా
పతివై నావు; దశప్రజాపతులు భాస్వద్విశ్వకర్మాచ్యుతుల్
క్షితిపు ల్మానవముఖ్యులే ప్రజాపతులె; యీచిత్రంబె తెల్పుం బ్రజ
పతివౌ నీ యపరస్వరూపములుగా వారుంట, భీమేశ్వరా!

### 58. ఓం హిరణ్యరేతసే నమః

అగు రేతస్సన శక్తికరము; హిరణ్యంబన్న విష్ణ్వర్థకం
బగుటన్, బాలనశక్తి నీదని రహస్యార్థమ్ము; సూర్యాగ్నులున్
దగి రీ పేర హిరణ్యరేతులనఁగాఁ, దత్సారమెన్నంగ నీ
దగు నీ రూపమె యొప్పుచుఁ జెప్పికొనరాదో? దేవ! భీమేశ్వరా!

**59 ఓం దుర్ధర్షాయ నమః**

ఇతరుల్ నిన్నుఁ దిరస్కరింప, నవమానింపంగ, నోడింప లేఁ;
రతికష్టంపడి సాధకుండు క్రమయోగాభ్యాసి కాకున్న, నా
శ్రితుఁడై నన్ భవదాదరార్హుఁడయి నిన్జేరంగ లేకుంట, భా
రతు లన్వర్థకమంచు నీ కిడిరి దుర్ధర్షాఖ్య, భీమేశ్వరా!

**60. ఓం గిరీశాయ నమః**

నీహారాద్రి గిరీశుఁడన్న నదియు న్నీరూపమే యుంట; రౌ
ప్యాహార్యప్రభుతన్ గిరీశుఁడవు నీవై నాఁడ; వీ విశ్వసం
దోహంతేవా జనింప నీకు గిరిశక్తుల్ లాతికి న్లేమిచే
నాహా! నీకు గిరీశసంజ్ఞ కడు నన్వర్థంబు; భీమేశ్వరా!

**61. ఓం గిరికాయ నమః**

అమృతేశ్వర్యమృతేశ దంపతుల నిత్యంబెచ్చటన్నిల్చి, యు
త్తమ భక్తుండు సుధాప్లుతుం డగునో యా స్థానంబె కైలాస భూ
ధ్రము; నీ వచ్చటఁ బండుటన్ గిరిశసార్థఖ్యాతి నీ కబ్బె; ఆ
దిములో మిమ్మటఁ గొల్చుచెప్పుడో, కపర్ది! దేవ! భీమేశ్వరా!

**62. ఓం అనఘాయ నమః**

భ్రమలై దుష్కినుఁ జిక్కలేకునికి నిర్ద్వంద్వుండవై, నిర్మల
త్వము నీ సొమ్మయి, పావనుండవయి, శాతజ్ఞానశాంతస్వరూ
పముతో వెల్గు పరాత్పరుండవగుటన్, బాపంబు నిన్నంటమిన్
బ్రమథేశా! యనఘుండవై తివి నమోవాకంబు; భీమేశ్వరా:

**62. ఓం భుజంగభూషణాయ నమః**

నరు లెద్దాని భుజంగరూపమున నన్మానింతు; రేశక్తి న
న్నరికట్టున్నిరతంబు; దేనఁ బరిపూజ్యత్వమ్ము మే చెల్వొదా
వురమా నా, కదె భూషణంబనెడి నేర్పుం జూపనో, చూడ న
బ్బురమానట్లు భుజంగభూషణుఁడవై మోదింతు, భీమేశ్వరా!

64. ఓం భర్గాయ నమః

'భరగో భర్గ' యటన్న నిర్వచనమున్, భారంజ్ గముల్ ధాతు జా
ర్థరహస్యమ్మును, లోకముల్వెలయఁగా రంజిల్లఁగాఁ గ్రమ్మఱన్
దరలంగాఁదగు మూలమీవయనుచు న్నాటించుట, న్నీకె సూ
పరమార్థస్ఫురణమ్ముతోడఁ జను నీ భర్గాఖ్య, భీమేశ్వరా !

65. ఓం గిరిధన్వనే నమః

గిరివిల్లున్, హరిబాణమై, గొనము భోగిశ్రేష్ఠుఁడై యొప్పఁడై త్రి
పురముం గొట్టితివంట, యోగపరతన్మార్థమ్మెవిల్, సత్త్వమే
శరమున్, మూలగశక్తియే గొనము, లక్ష్యమ్మా త్రిదేహమ్ము ల
స్వరుసన్నెల్పు గురుండవంటె; గిరిధన్వా! దేవ! భీమేశ్వరా !

66. ఓం గిరిప్రియాయ నమః

ఆనందాకృతి శంకరున్నిను సహస్రారమ్మున న్నిల్పు ని
ధ్యానాభ్యాసి విరాగియోగి గిరివిఖ్యాతిందగున్; ప్రేమ నీ
వా నిష్కాముని గాంచి, నాగిరి తదీయమ్మైన మూర్ధమ్మటం
చానందింతు; గిరిప్రియాఖ్య తగె నీకారీతి, భీమేశ్వరా!

67. ఓం కృత్తివాసనే నమః

నిరతోపాసకుఁడైన భక్తుని తమిన్ నింద్యమ్మయైనం గృపా
పరత, న్వాఁడు సుముక్షుండయినఁ దీర్పం జూతునంచున్ జగ
మ్మెఱుఁగం జెప్పనో, యాగజాసురుని తోలే కట్టువుట్టమ్ముగాఁ
బరఁగింపందగెఁ గృత్తివాసుఁడను నీప్రఖ్యాతి, భీమేశ్వరా!

68. ఓం పురారాతయే నమః

నీ తత్త్వమ్ము నెఱింగి నీ భజనము న్నేమమ్ముతోఁ జల్పు సం
పూతాచారుల స్థూలముఖ్యపురము ల్పోకార్చుట, న్నీపురా
రాతిప్రఖ్య సుసార్థమయ్యెఁ గరుణారాశీ! పురాహప్తి నా
కేరీతిం దొలఁగింతువో, జడుఁడఁ దండ్రీ! దేవ! భీమేశ్వరా!

### 69. ఓం భగవతే నమః

జ్ఞానమ్ముఁ యశము న్విశిష్టతయు నిష్కామిత్వముఁ ధర్మముఁ
నానాశక్తియు తత్త్వముఁ మహిమ యానందమ్ము నైశ్వర్యమున్
మానాతీతమనోరమత్వమును సంపత్ప్రేమముల్ నీవి కాఁ
గా, నన్వర్థమెకాను నీదు భగవత్ప్రమాఖ్య? భీమేశ్వరా!

### 70. ఓం ప్రమథాధిపాయ నమః

ప్రమథమ్ముల్ హయముల్ మనః ప్రమథనవ్యాపారవల్గద్ధృషీ
కము, లవ్వానిపయిం బ్రభుత్వము, విపక్షవ్రాతము న్నీనిదే
శముతోడన్మథియించు నాప్రమథ సంజ్ఞ వ్యూహమం దాధిప
త్యము చెల్లం బ్రమథాధిపాహ్వ కడు సార్థంబయ్యె, భీమేశ్వరా!

### 71. ఓం మృత్యుంజయాయ నమః

అత్యాచారుల మ్రింగఁ బొమ్ము, శివరక్షాకాంక్షుల న్ముట్టకే
కృత్యల్ నాదురజాలనంగ, వెఱఁ బాఱెన్మృత్యువే కావునన్
"మృత్యుర్ధావతి పంచమో" యనెడి ప్రామిన్కొందు మృత్యుంజయా!
ప్రత్యగ్రంబటె, నీకనాదియగు నీ ప్రఖ్యాతి? భీమేశ్వరా!

నీ పైదూఁకెనె మృత్యువెప్డయిన దానింగెల్చినా వన్నచో
నాపుట్టుస్సయితమ్ము గెల్చితనియే యర్థమ్ము, మృత్యుంజయా!
నీ పారమ్యము నాదిశూన్యత నసందేహమ్ముగాఁ దెల్పఁగా
నీ వత్కేఁ యమృతత్వదాయి యని మాకింపౌను, భీమేశ్వరా!

యమునిం గెల్చితి, నల్వఁ గెల్చితివి, మాయం గెల్చికొన్నాఁడ, వా
నుమ బాణుంగడముట్ట గెల్చితివి, నిస్తుల్యప్రతాపుండ, వీ
వమృతాకారుఁడ వౌట, నిన్నును, నినుఁ ధ్యానించు భక్తాళి సై
తము, మృత్యుంజయ! మృత్యువంటదన వింతా? దేవ! భీమేశ్వరా!

72 ఓం సూక్ష్మతనవే నమః

అందిందన్బనిలేక, నిర్మల పరాత్మాకారత న్నిల్తు వీ
వెందుఁ; నీకె "అణోరణీయ" యనుశ్రుత్యర్థంబు యోగించు, బల్
చందా మేనును, మంత్రసూక్ష్మతను భాసంబొప్పు; గానన్ జగ
త్కందా! సూక్ష్మతనుప్రసిద్ధికి నమస్కారంబు; భీమేశ్వరా!

73 ఓం జగద్వ్యాపినే నమః

"ఈశావాస్య మిదంజగ"త్తనెడిదే యిమ్మాట; సృష్టిచ్ఛతో
నీశా! యీ జగదాకృతింబడసి యీవే చిత్కళాయుక్తి నా
వేశింపన్ సకలంబు నందలమఁగ న్వేఱెవ్వరున్నార, లో
యాశాబేల! భరింపఁగాఁదగి జగద్వ్యాప్యావ్వా? భీమేశ్వరా!

74 ఓం జగద్గురవే నమః

పితవున్, శౌనక చక్రవర్తివియు, సద్విద్యాఖ్యసంపద్విహా
యితదక్షుండవు, పూజ్యపాదుఁడవు, భాయిష్ఠాప్రమేయామలా
కృతివిన్, వేదవచః ప్రభుండవగుటన్ గీర్తించు లోకమ్ము ము
ఖ్యతము న్నిన్నె జగద్గురుండని, వరేణ్యా! దేవ! భీమేశ్వరా!

75 ఓం వ్యోమకేశాయ నమః

కడలే వస్త్రములన్న నీకు నసితాకాశంబె కేశంబు నా
నడరున్; వ్యోమకవర్ణసంహతికి వాచ్యమైన భూతాళి కీ
శుఁడవున్; వ్యాద్గుహావ్యోమ, మం దడరు కేశుండన్న మూర్తిత్రయా
త్ముఁడు బ్రహ్మం; బిటు వ్యోమకేశుఁడను మెప్పూన్నిదే భీమేశ్వరా!

76 ఓం మహాసేనజనకాయ నమః

సూనున్ దారకదైత్యమర్దనచణున్ శూరున్ దివౌకోమహా
సేనానాయకుఁ గన్నవాఁడవగుటన్, సృష్టిచ్ఛతో నీమహా
సేన న్మప్పదియాఱు తత్త్వముల మున్ సృష్టించుకొంట న్మహా
సేనా! తజ్జనకుండవీవనుట నంసిద్ధంబు, భీమేశ్వరా!

77. ఓం చారువిక్రమాయ నమః

హరికి న్నీకును "చారువిక్రమ" పదం బారూఢమై యుంటచే
హరిభిన్నుండవు కావు నీవు; జగమందన్నింట నాత్మాకృతిన్
హర! నీవే "తదనుప్రవిశ్య" యను శ్రుత్యర్థానుసారమ్ముగా
నురడింపందగెఁ జారువిక్రముఁడు నా యోగ్యాఖ్య, భీమేశ్వరా!

78. ఓం రుద్రాయ నమః

విలయోద్యోగమువేళ భూతతతిఁ గూల్పెట్టింతు; నిన్గొల్చు భ
క్తుల వేధించెడి యార్తులం దవ్వులకుం దూలింతు; నీ భక్త శ
త్రుల నేడ్పింతువు; చండశాసనమునన్ రుద్రుండవౌ నీకె సూ
లలితంబై తగె రుద్రసంజ్ఞ, శ్రితపాలా! దేవ! భీమేశ్వరా!

79. ఓం భూతపతయే నమః

సకలస్థావర జంగమాత్మక విసృష్టంబున్ మహాభూత పం
చకమున్ బాలిమదాఖ్యులన్ నిరతమున్ శాసించుటన్, క్షేమకా
రకమౌ భూతచతుర్దశీ తిథిసపర్య ల్పొందుటన్, లోకనా
యకతన్ బొల్చెడి నీదె భూతపతిసార్థాభిఖ్య, భీమేశ్వరా!

80. ఓం స్థాణవే నమః

కలఁగంబాఱక దుంగఁబోలి, పటుయోగ స్థైర్యమందుండుటన్
వెలుతుల్లేక పరాత్మవై యఖిలమౌ విశ్వంబున న్నిండుటన్
బ్రలయంబందును నాశముం గనక శశ్వద్భావముం గాంచుటన్
బిలువంజొచ్చిరి స్థాణునామమున ని న్విశ్వేశ! భీమేశ్వరా!

81. ఓం అహిర్బుధ్న్యాయ నమః

అగమూలమ్మది బుధ్న, మా యగమె బ్రహ్మాండమ్ము, తన్మూలగం
బగు ఘోరాహియె శేషుఁ, డాతఁడె యజాండాధారమౌ నన్నచో
జగతీభారవహుండ వీ వనెడి శాస్త్రమ్మొందు వ్యర్థమ్మె? యొ
ప్పఁగ నీ వాతడె యన్న, నీయదె యహిర్బుధ్న్యాఖ్య, భీమేశ్వగా!

82. ఓం దిగంబరాయ నమః

నీ నామమ్ము దిగంబరుండనఁగఁ గన్నిట్రెంచి నోర్విచ్చి పో
హీనజ్ఞానులు కట్ట గుడ్డయును లేదే దేవుఁడా? యంద్రు; ని
న్నానాతీత విరాట్ఛరీరునిగ సంభావింప, నీ దిక్కులే
యా నీ యంబరరూపమం చెఱుఁగ రాహా! తెల్పి; భీమేశ్వరా!

83. ఓం అష్టమూర్తయే నమః

సమయద్యోతక సూర్యచంద్రులు, జగత్సామగ్రియా పంచభూ
తము లాత్మ్యుండును నీకు మూర్తులన నర్థంబేమి? నీ కాని ద
న్యము లేదఁటయె; లోవెలిన్వెలయు దీవంటే కదా; యిట్టి ధ్యా
నమె మోక్షప్రద మష్టమూర్తిపదవంద్యా! దేవ! భీమేశ్వరా!

84. ఓం అనేకాత్మనే నమః

ఒకఁడే సూర్యుఁ డనేక కుంభజల బింబోద్ద్యోతి యైనట్లు, నీ
వొకఁడయ్యున్, బహుజీవరూపములుగా నొప్పారి, తద్యోగ్య దే
హాకదంబమ్మును నీవకావుట ననేకాత్మాఖ్య నీకయ్యె; నో
సకలాత్మా! పరమాత్మ! జీవగణపూజ్యా! దేవ! భీమేశ్వరా!

85. ఓం సౌమ్యాయ నమః

నిరతమ్మున్ మృదుభావసౌమ్యతలు సన్దీపింప, భక్తాళికిన్
వరివస్యాఫలరూప నిత్యసుఖ మాపాదించుచున్ బోధ ని
ర్భరులం జల్పుట, రోహిణీతనయరూపం బీవయౌటన్, కృపా
శరధీ! సౌమ్యసమాఖ్య నీ దగుచుఁ బూజ్యంబయ్యె; భీమేశ్వరా!

86. ఓం శుద్ధవిగ్రహాయ నమః

సహజంబైన భవచ్ఛరీర మమలస్పర్శంబె; సృష్టిస్పృహా
సహితంబై, గుణశక్తియుక్తి శబల చ్ఛాయన్వహించున్; స్పృహా
రహితంబై, నిజబోధ శర్మమయమై రాజిల్లుచో, శుద్ధ వి
గ్రహ సంజ్ఞన్నుతిఁ గాంతువో స్ఫటికసంకాశాంగ! భీమేశ్వరా!

87. ఓం శాశ్వతాయ నమః

హర ! నాపరాకృతియు క్తమౌ జగతిగా, నందైన చిల్లేఖగా
స్థిరమై, వానిని సంహరించుకొని శ క్తిస్పందమే లేక, యో
గరతి న్నిశ్చల చిత్సుఖాత్మతను నిష్కంప్రమ్ముగా నుందు నీ
చరితం గన్గొన నిన్నె శాశ్వతుఁడనన్ సార్థమ్ము; భీమేశ్వరా !

ఉన్నా వుండెదవుంటి వోటనఁగ నీ కున్నే ? జగద్రూప సం
పన్నత్వమ్మొకవేళ, నొక్కతఱి శర్మజ్ఞాన నైసర్గ రూ
పౌన్నత్యమ్మును మీఱి, యిట్టులు విచిత్రాకారివై పొల్చు ని
న్నెన్నం బోలదె ? శాశ్వతాఖ్య యన నీదేయంచు, భీమేశ్వరా !

88. ఓం ఖండపరశవే నమః

నరులందు న్భవదంశజీవుల నఖండబ్రహ్మము న్నిన్ బర
స్పరము న్భిన్నులు గాఁదలంచి చెడు నిస్సారార్థ దుర్వాద త
త్పరుఁడే ఖండపరుండు; వానిని బునర్భావంబుతో నొంచుటన్
బరఁగె న్నీకిలలోన ఖండపరశుప్రఖ్యాతి; భీమేశ్వరా !

89. ఓం అజాయ నమః

అజ శబ్దమ్ము విధీశ విష్ణులకు నౌనన్నన్, భవద్రూపు లా
యజముఖ్యుల్; జననమ్మె లేదనుట నీ కంతమ్ము లేదంట కా
దె ? జనుర్మృత్యుజరాదిభావములు నీ కెన్నండు లేకుంటచే
నజ విఖ్యాతిఁ బరాత్పరుండవనియే యర్థమ్ము; భీమేశ్వరా !

90. ఓం పాశవిమోచనాయ నమః

అమలస్వాంతమునం దనన్యమతితో ధ్యానించు నీ భక్తు నే
రమి లెక్కింపక, దుర్దశల్దొలఁచి, కర్మఖ్యాతపాశమ్ము ము
క్తముగావించి, యహం మతి న్గెడపి, మోక్షమ్మిచ్చుట నీ కె హృ
ద్యముగాఁ బాశవిమోచనాఖ్య తగె విద్వత్సేవ్య ! భీమేశ్వరా !

91. ఓం మృడాయ నమః

ను విధ్యుక్తముగా భజించు జనుల న్నిర్ణిద్రమౌ మచ్చికన్
ని యిందందు సుఖింపఁ జేయుదువు గావున్ స్వస్వరూపమ్మునం
నయమ్మున్ సుఖియించువాఁడవయి, తుర్యాతీత సమ్రాట్టువై
ంనుటన్ నీ మృడనామమెల్లరకు సన్మాన్యమ్ము, భీమేశ్వరా!

92. ఓం పశుపతయే నమః

శువుల్జీవులు జన్మపాశపటు నిర్బంధార్తులౌ వారి; నీ
శమవ్పాశము; దాని వీడ్చెడి ప్రభుత్వమ్మందు నీ దౌటఁ, ద
్శకర్మానుగుణమ్ముగా ఫలము నాపాదించి శాసించుటన్,
శునామప్రమథేశతన్ బశుపతిప్రఖ్యాతి, భీమేశ్వరా!

93. ఓం దేవాయ నమః

ంర! నీయంతట నీవ వెల్గుదు వనన్యాపేక్షమై, నీ చరా
ర రూపమ్మున, నాత్మరూపున సమస్తమ్మందు నున్వెల్గు, దీ
్ర భావమ్మున నీ యజాండతతులన్ శాసింతు, వీక్రీడలన్
రుపన్నికగు దేవనామము బుధస్తుత్యమ్ము, భీమేశ్వరా!

94. ఓం మహాదేవాయ నమః

వాఖ్య న్వెలసిల్లు దైవతము లేదే యెంతో యింద్రాదికం?
విశ్వమ్మును నీవు లోఁగొనఁగఁ దా నేదీ ప్రకాశించెనే?
వొకండవె వెల్గుచుండుటను నందీపించె నీకమ్మహా
దేవాభిఖ్య! తలంతు దానినె కృపాబ్ధీ! దేవ! భీమేశ్వరా!

95. ఓం అవ్యయాయ నమః

ననమ్ముఁ గ్రమవృద్ధియుఁ దఱుగు నాశంబన్న యీ మార్పులన్
నకుంటన్, సత మొక్కరూపునఁ జిదానందస్వరూపమ్ముతోఁ
నుకన్, సత్ఫల మక్షయమ్ముగ భవద్దాసాళికిం బెట్టుటన్
నుతింగాంచితి వవ్యయుండను మహావిఖ్యాతి, భీమేశ్వరా!

96 ఓం హరయే నమః

శివుఁడే విష్ణుఁడు, విష్ణుఁడే శివుఁ, డిదే సిద్ధాంతమౌనంటకో,
భువనేశీమను రూపమౌ హరిపదమ్మున్ సామగంబంటకో,
వివరింపం బనిపూనిరో భజదఘా విద్యాహారంబంచు, న
త్కవివర్యుల్ హరినంజ్ఞతో నిను నుతిం గావింత్రు, భీమేశ్వరా!

హరి శబ్దమ్మున నాలుగంగములు బ్రహ్మావిష్ణునిం దేజము
న్నర శక్తిం దెలువుం గ్రమమ్మున నన, న్మాయాయుతి న్సంగమ
స్థిరసద్గ్రస్థితి కల్పనిర్వహణమున్ జిద్రూపము న్నిచ్చి యం
చరు దార న్వచియించు నీహరి నమాఖ్యార్థంబు, భీమేశ్వరా!

97. ఓం భగనేత్రభిదే నమః

భగవాచ్యార్క నిశేశనేత్రముల సర్వమ్మున్బయల్వెట్టుచున్
భగవాచ్యాఖిల శక్తితో శకట సర్వవ్యాప్తిం గావించుచున్
భగవాచ్యామల ధర్మవస్త్రమును సర్వమ్మం దనుం బర్చుచున్
నెగడన్ నీభగనేత్ర భిత్పదము నందీపించె, భీమేశ్వరా!

98. ఓం అవ్యక్తాయ నమః

సకల స్థావర జంగమాత్మక తనూసంశోభ నీవొందనం
తకు నవ్యక్తుఁడవౌదు; దానికి నిదానమ్మైన నీయాది శ
క్తికి నవ్యక్తమె పేరు; శక్తునకు శక్తిన్భేదుగా నెంచులే
ప్రకటావ్యక్తత యంటకో వెలసె నవ్యక్తాఖ్య; భీమేశ్వరా!

99. ఓం దక్షాధ్వరహరాయ నమః

హర! దక్షుల్పొనరించు నధ్వరములం దగ్ని ప్రతిచ్ఛాయవై
సరిగా హోత్రము పంచి యాగభుజులన్ సంతుష్టినొందింతు, వి
వరునన్ నీహరనంజ్ఞ సార్థకముగా, భావాంతరమ్మెన్న, న
ధ్వర? దక్షాధ్వరభంగకారివన నంభావింత్రె? భీమేశ్వరా!

ంతులన్వేల్పులఁ బూజ్యపాదులఁ దిరస్కారంబు వాల్సేయు దు
ష్కృతి పానుప్లవుఁ జుట్టమైన విధువన్, శిక్షించు నేనంచు, లో
'తతుల్ మెచ్చఁగ, దక్షునధ్వరము భంగంబెట్టితే కాని, నీ
తరౌన్నత్యముఁ జూడలేని గుణమా? యీశాన! భీమేశ్వరా!

100. ఓం హరాయ నమః

ప్రలయావస్థను బాంచ భౌతికము సర్వమ్మున్ హరింపంగ, ని
ష్కలరింప న్భజియించు వారల మహాఘౌఘంబుఁ దూలింప, నీ
లితంబౌ హరనామ మొప్పెను, వికల్పంబింతయున్లేక, ని
ర్మల చిత్తమ్మున దానినెంతుఁ బరమాత్మా! దేవ! భీమేశ్వరా!

101. ఓం పూషదంతభిదే నమః

ంనులన్ సాధ్వులఁ బూజ్యపాదులఁ దిరస్కారంబు పాల్సేయు దు
ను కృత్యమ్మనుమోదబుద్ధిఁ గను దుష్టవ్యక్తి కీశిక్షయే
నుఁ జుండంటకె పూషుదంతములు డుల్చన్ దక్షుయజ్ఞమ్మునం
నువయ్యెన్, శివ! పూషదంత భిదభిఖ్యాసిద్ధి; భీమేశ్వరా!

సూర్యోదయ శీర్షముల్ మును తమోవ్యాప్తమ్ముగా, సూర్యభా
మ్మేర్మ వానిని బైలుపెట్టునను విశ్వాసంబగున్; "యస్యభా
• సర్వంప్రవిభాతి" యన్న శ్రుతికిన్ సార్థక్యమేపల్క, నీ
ా సత్యమ్ముగఁ బూషదంతభిదభిఖ్యాసిద్ధి, భీమేశ్వరా!

102 ఓం అవ్యగ్రాయ నమః

విరామబంగు సృష్టి, రక్షణము, సంహారంబు, నిష్కామ భా
వతార్థత్వముఁజూచి యిచ్చుటయు, యోగక్షేమ నిర్వాహ మ
విధిన్ వ్యగ్రుఁడు నిన్నుమించి యెవఁడు న్గాన్పింపమి న్నీకె నం
వమయ్యెన్ సకలాగమంబులను నవ్యగ్రాఖ్య, భీమేశ్వరా!

103 ఓం సహస్రాక్షాయ నమః

నీసర్గంబగు నప్రమేయ జగతి న్నిర్నిద్రతం గాచు న
త్త్వాసక్తిం గొని, మంచిచెడ్డలరయన్ ద్వ్యద్రూపమౌ జ్ఞానమే
భాసిల్లంగ ననంతనేత్రములుగాఁ బ్రాజ్ఞుల్ సహస్రాక్ష సం
జ్ఞా సమ్మానితుఁ జేసి కొల్తురు నినున్ జ్ఞానాక్ష! భీమేశ్వరా!

అక్షుల్గల్గు సమస్తభూతములు నీయాకారమే యౌట, భూ
తాక్షుల్నీవి; సహస్రమంటకు ననంతార్థమ్ముతో నిన్ సహ
స్రాక్షుండంచు, సహస్రపాదుఁడనుచో నారీతినే చెప్పిఁ బ్ర
త్యక్షంబౌ జగమే భవత్తనువుగా నర్చింత్రు, భీమేశ్వరా!

104 ఓం సహస్రపదే నమః

భవదాకారమజాండ; మందునఁ జిదాభాసుండవై, సర్వగ
త్వ విభూతిం గొని, దేశకాలనియతిం బాటింపకే సంచరిం
తువనంతాకృతులందుఁ; గాన విబుధస్తుత్యుండవై నావు, సా
ధ్వవనా! సార్థకమౌ సహస్రపదభిఖ్యన్ దేవ! భీమేశ్వరా!

105. ఓం అపవర్గప్రదాయ నమః

కపటుల్ కర్మఫలానుసక్తమతులు న్గాకుండి నీపట్టుచే
నపనీతప్రతిబంధులై మెలఁగు బ్రహ్మాత్మైక్య నిష్ఠాత్ములన్
గృపతో శర్మన దుఃఖవర్జిత పదశ్రీయుక్తులం జల్పు నీ
వపవర్గప్రదనామ భూషితుఁడ వౌటబ్రంబె? భీమేశ్వరా!

106. ఓం అనంతాయ నమః

మొదలున్నన్ దుదియుండి తీఱు; మొదలే పూజ్యంబుగా నంత మె
య్యది? జ్ఞానాకృతితోడ సర్వమున నీవెకాలము న్నిల్చుటన్,
మొదలే లేనటు లంతమున్ గగనముంబోలె న్గనన్రాని నే
కుదిరెన్నీకు ననంతసంజ్ఞ, శశభృత్కోటీర! భీమేశ్వరా!

107. ఓం తారకాయ నమః

తెలియం జూపుడు జ్ఞాననేత్రమయి దుర్దృశ్యమ్ముల న్గాపునన్
బలితంపుందరితో సరఁగు పడద న్వార్థిన్వలెన్ దుస్తరా
విలసంసార మహాబ్ధి తీరమును సంవిన్నౌకతోఁ జేర్తు భ
క్తులఁ గానన్, దగెఁ దారకాహ్వయము నిస్తుల్యంబు, భీమేశ్వరా !

108. ఓం పరమేశ్వరాయ నమః

హర! యంభోజభవాదు లీశ్వరునియం దాలీను లైపోవ, నీ
శ్వరుఁడు న్నీకళయందు లీనుఁడగు నా పై నద్వితీయుండ వై
పరఁగ న్నీ పరమేశ్వరాఖ్య చను నన్వర్థంబుగా; దీనితో
సరి నీపేరులు మాటయెన్మిది, యుమేశా! దేవ! భీమేశ్వరా !

శ్రీ పరమశివార్పణమస్తు

అర్థజ్ఞల్ బుధులేర్చి కూర్చిన త్వదీయాష్టోత్త రాఖ్యాశతం
బర్థజ్ఞానముతో స్మరింపఁ బురుషార్థావాప్తి యబ్రంబె? భ
క్తార్థోత్సర్జన కల్పభూరుహము కాదా! పల్కనన్ వ్రాసినన్;
పార్థానందద! దీని ప్రాపునని నిన్ బ్రార్థింతు, భీమేశ్వరా !

తలపూవౌ శశికిన్ జటాచయరణద్భాగీరథీ మాతకున్,
లలితోత్సంగగ వారణాస్య శరజన్మ ప్రఖ్యులౌ నీ తనూ
జులకున్, సామెయిఁగొన్న నీదు సతికన్ శుభ్రాద్రి వాసమ్ము శో
భిలు నీకున్ జయమంగళమ్ము కరుణాబ్ధీ! దేవ! భీమేశ్వరా !

ఓం తత్సచ్ఛివోహమ్

శ్రీకాకుళవాసి, హరితస గోత్రుఁడు, శ్రీ సీతారామ కామాంబా నందనుఁడు,
శ్రీ శ్రీయానందనాథాపర నాముఁడు, ఈశ్వర సత్యనారాయణశర్మ వ్రాసిన
భీమేశ్వరనుతి యను శివాష్టోత్తర శతనామ పరమార్థము
శ్రీ భీమేశ్వరార్పితము.

# ఈ గ్రంథకర్త రచనలు

## వెలువడినవి

1. బాలాంబికా శతకము.
2. అమ్మతో ముచ్చటలు.
3. శ్రీ దేవీపంచస్తవి యనువాదము, సవివరణము.
4. శ్రీసూక్త రహస్యార్థము.
5. శ్రీ గౌరీశ్వర నుతి.
6. మహాసౌర మంత్రపాఠము, అనువాదము.
7. శ్రీ జానకీశ్వర శతకము.
8. జీవానందన నాటకము. (వైద్యనాటకము) ఆనందరాయ మఖికృతి కనువాదము
9. శ్రీ సౌందర్యలహరి యనువాదము, సవిశేష వివరణము. 0-12-0
10. శార్ఙ్గధర త్రిశతి, యనువాదము 0-10-0
11. పుత్రవతీ హితోపదేశములు. 555. 1-8-0
12. శిశువ్యాధులు. 1-0-0

## వెలువడనున్నవి.

1. శ్రీ విద్యాభాష్యము.
2. శ్రీ సిద్ధాంతశిఖామణి (శైవాద్వైత గ్రంథరాజ వివరణము)
3. శ్రీ చండీసప్తశతీస్తోత్రపాఠము (విపుల వివరణము.)
4. హ్రీంకార శతకము.

మ.రా:— 1-8-0 పంపెడి వారికి శ్రీ శివానంద నాథుల సౌందర్యలహరియు, శ్రీ శివాష్టోత్తర శతనామ వివరణము (భీమేశ్వర నుతి) అను రెండు పుస్తకములు పంపఁబడును. వలయువారు గ్రంథకర్తకు వ్రాయవలయును.